అస్సాం, బీహార్ వరదబాధి
తులకు సహాయం:
విరాళాలకు నెహ్రూ విజ్ఞప్తి
—3 వ పేజీ

# ఆంధ్రపత్రిక

కొత్త పరిశ్రమల స్థాపనకు
ప్రత్యేకకార్పొరేషన్ఏర్పాటు:
కేంద్రప్రభుత్వాలోచన
—2 వ పేజీ

318869

THE ANDHRA PATRIKA - MADRAS. సంపుటం 41. సంచిక 121 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO సోమవారం 2-8-1954 Reg. No. M. 1118 4 పేజీలు వెల 1 అణా

# ఇండోచైనాకు యుద్ధవిరమణ సంఘ ఉద్యోగుల ప్రయాణం

## ఢిల్లీలో మూడుదేశాల పర్యవేక్షక సంఘ తొలి సమావేశంలో నిర్ణయం

### ప్రధాని నెహ్రూ ప్రసంగంతో సమావేశ ఉపక్రమణ

న్యూఢిల్లీ, ఆగస్టు 1: ఇండోచైనా రాష్ట్రాలైన వియత్నాం, కాంబోడియా, లావోస్‌లకు సివిల్ మిలిటరీ ఉద్యోగులు పన్నెండుమందిని ముందుగా పంపటానికి యుద్ధవిరమణ పర్యవేక్షక సంఘం వారు నిశ్చయించారు.

ఈ బృందం ఈవారంలోనే అక్కడికి బయలుదేరుతుంది. అక్కడి పరిస్థితులేమిటో సంఘంతరఫున అక్కడికి వెళ్ళే సిబ్బందికి ఏయే యేర్పాటులు చేయవలసివుంటుందో అంతా వారు పరిశీలిస్తారు.

వీరిలో పర్యవేక్షక సంఘంలోని 3 దేశాలవారు వుంటారు.

పర్యవేక్షక సంఘ సమావేశం నేడు దయం 10.30 కు భారత విదేశాంగ కార్యాలయ సమావేశ మందిరంలో జరిగింది. భారతదేశం తరఫున వి. కె. కృష్ణమీనన్, విదేశాంగ వ్యవహారాల శాఖ ప్రధాన కార్యదర్శి ఎన్. ఆర్. పిళ్ళె, విదేశాంగశాఖ కార్యదర్శి ఆర్. కె. నెహ్రూ, కామన్వెల్తు కార్యదర్శి ఎస్. దత్తు, రక్షణశాఖ కార్యదర్శి ఎం. కె. వెల్లోడి సమావేశంలో పాల్గొన్నారు.

కెనడా తరఫున భారతదేశంలోని వారి హైకమీషనర్ ఎస్కాట్ రీడ్ ప్రభృతులు కె గురూ, పోలెండు తరఫున భారతదేశంలోని వారి రాయబారి జెర్జీ గ్రజ్డినస్కీ, ఆయన ప్రథమ కార్యదర్శి జోరెస్టైన్ పాల్గొన్నారు.

భారత ప్రతినిధులూ, మిగతావారు ఎదురూ బొదురూగా కూర్చున్నారు.

ప్రధాని నెహ్రూ సమావేశాన్ని ఉపక్రమిస్తూ ప్రసంగించారు. ఆయన కూర్చున్న కుర్చీ వెనుక 'సత్యమేవ జయతే' అనే మాటలున్న భారత ప్రభుత్వముద్రిక ఛాయాపటంవున్నది.

నెహ్రూ ప్రసంగించాక కెనడా తరఫున రీడ్, పోలెండ్ తరఫున గ్రజ్డినస్కి ప్రసంగాలు చేశారు.

సమావేశం స్నేహంగా పాయిలా పాయిలాగా జరిగిపోయిందని, ప్రసంగాల అనంతరం చర్చనీయాంశాలను ఎత్తుకొన్నారనీ, సగంపైచిలుకు అంశాలపై ఏకగ్రీవాభిప్రాయం కుదిరిందనీ

(3 వ పేజీ చూడుడు)

### చైనా సభ్యత్వ సమస్య

#### ఐసెన్‌హోవర్‌కు సెనేట్ ఆదేశం

వాషింగ్టన్, జూలై 29: సమితిలో చైనా ప్రవేశాన్ని ప్రతిఘటించవలసిందిగా అమెరికా అధ్యక్షుడిని ఆదేశిస్తూ సెనేట్ నేడు తీర్మానించింది.

బొంబాయి, జూలై 30: శ్రీ వి. కె. కృష్ణమీనన్ నేటిమధ్యాహ్నం ఇక్కడికి విమానంలో చేరారు. విమానాశ్రయం నుంచి బొంబాయి ముఖ్యమంత్రి మొరార్జీ దేశాయిని కలుసుకోడానికివెళ్లారు.

## ఇండోచైనా యుద్ధ విరమణకు నెహ్రూ కృషి

### కెనడా ప్రతినిధి జోహార్లు: ముందు కార్యక్రమంపై భారత ప్రధాని వివరణ

న్యూఢిల్లీ, ఆగస్టు 1: ఇండోచైనా యుద్ధవిరమణ పర్యవేక్షణ సంఘ తొలి సమావేశాన్ని ప్రారంభిస్తూ, స్నేహపూర్వకమూ సహకారభావయుతమూ అయిన వాతావరణాన్ని పెంపొందించడానికి సభ్యదేశాలు కృషిచేయాలని ప్రధాని నెహ్రూ ఉద్ఘోషించారు.

"మన మందరమూ సమైక్యతతో కృషి చేయడానికి అనువైన వాతావరణం సృష్టించి, ఒక నిర్దిష్ట విధానాన్ని రూపొందించుకోవడమే నేటి మన సమావేశంలో ఆంతర్యం. యిది ఈ వారంలో జరుగనున్న సమావేశాల లక్ష్యం" అని ప్రధాని చెప్పారు.

మనం అసలు కార్యాచరణకు ఉపక్రమించడానికి ముందుగా అవసరమైన కొన్ని అంశాలను స్పష్టంగా తెలియచెప్పుకోవడం ఈ సమావేశం జరపడంలో మన రెండవలక్ష్యం అనికూడా ప్రధాని అన్నారు.

ఒప్పందం ప్రకారం పర్యవేక్షణ సంఘం వియత్నాంలో ఆగస్టు 11 వ తేదీనా, లావోస్ కాంబోడియాలలో ఆ తరువాత కార్యకలాపాలు ప్రారంభించవలసి ఉన్నదని ఆయన తెలియచేశారు.

ప్రారంభోపన్యాసం ముగించి ప్రధాని సమావేశం వదలివెళ్లిపోయారు.

ఆతరువాత వి. కె. కృష్ణమీనన్ అధ్యక్షస్థానాన్ని అధిరోహించారు.

కెనడా ప్రతినిధివర్గ నాయకుడు ప్రసంగిస్తూ ప్రధాని నెహ్రూ రాజనీతిజ్ఞతకు జోహారులర్పించారు. ప్రధాని ఆదిలో ప్రతిపాదించిన పట్లూ ప్రతిపత్తికం ఇండోచైనా యుద్ధవిరమణ ఒడంబడికలో ప్రతిబింబించినదనీ, ఆ పట్టూ తాల ప్రాతిపదికగానే కొలంబో పథ రాజ్యాలు సూచనలు చేశారని ఆయన అభిభాషించారు.

పర్యవేక్షక సంఘం విజయవంతంగా తన బాధ్యతలు నెరవేర్చి, కృతి పోలెండ్ అన్ని విధాలా సహకరించగలదని పోలెండ్ రాయబారిహామీఇచ్చారు.

## వేరుసెనగనూనె ఎగుమతి కోటా

### ఎక్కువచెయ్యాలని వ్యవసాయశాఖమంత్రి సూచన

కర్నూలు, ఆగస్టు 1: వేరుసెనగనూనె ఇంకా బాగా ఇతరదేశాలకు ఎగుమతి కావడానికి వీలుగా ఎగుమతి కోటాలను కేంద్రప్రభుత్వం తిరిగి నిర్ణయించాలనీ, వేరుసెనగనూనెమీద ఇటీవల విధించిన ఎగుమతి సుంకాన్ని రద్దు చెయ్యాలనీ వ్యవసాయశాఖ మంత్రి తిమ్మారెడ్డిగారు అన్నారు.

ఇప్పుడున్న వేరుసెనగనూనె నిలవలలో కేంద్రప్రభుత్వం నిర్ణయించిన ఎగుమతి కోటా నాటికి 15 వంతులు కూడా లేదనీ, ఇంకా సులభ యివేల టన్నులవరకూ సులభంగా ఎగుమతి చేయవచ్చునంటూ ఆయన ఇలా వివరించారు.

"సబ్బు, వనస్పతి పరిశ్రమల వసరుగా సెనగనూనె సప్లయి చెయించాలనే దృష్టితోనే ఇంత తక్కువ ఎగుమతి కోటా కేటాయించారు. విదేశాలలో టన్నుకు 19 వందల రూపాయలువచ్చే ఈ వేరుశెనగనూనెను ఈ పరిశ్రమలకు సప్లయి చేసేబదులు టన్ను ఒకటింటికి పదకొండువందల రూపాయలచొప్పున కొటినూనెను దిగుమతి చేసుకోవడం సమంజసం. కేంద్రప్రభుత్వం నిర్ణయించిన ఎగుమతి కోటావల్లనూ, టన్నుకు 350 రూపాయల ఎగుమతి సుంకంవిధించినందునా ధరలు పడిపోయినవి ఉత్పత్తిదారులకూ, వ్యాపారస్థులకూ ఉత్సాహం తగ్గింది. కిందటి ఆగస్టులో 73 రూపాయలున్నవేరుశెనగనూనె ఈయేడు జనవరి నెలలో 53 రూపాయలకుతగ్గింది. ఆతరువాత మొదటి ఆరునెలల్లో క్రమంగా 41 రూపాయలకు తగ్గింది. అంతలో అకస్మాత్తుగా ఎగుమతికోటానునిర్ణయించి విపరీతంగా ఎగుమతి సుంకాలు విధించడంవల్ల 39 రూపాయలవరకూ తగ్గిపోయింది."

## ప్రాయోపవేశవిరమణ

కర్నూలు, జూలై 31: మాజీ సైనికులకు భూములు ఇచ్చే వ్యవహారాన్ని పరిశీలించి మాజీ సైనికులకు న్యాయం జరిగేటట్లు చూస్తానని సైనిక బోర్డు ప్రెసిడెంట్ జనరల్ హామీ ఇచ్చినందున నేటి (యీనెల 31 వ తేదీ) సాయంకాలంనుంచీ ప్రాయోపవేశం విరమిస్తానని అప్పారావుగారు అన్నారు.

## ట్యునీసియాకు స్వపరిపాలనాధికారం

### ఫ్రెంచి ప్రధాని మెండెస్‌ఫ్రాన్స్ ప్రకటన

ట్యూనిస్, ఆగస్టు 1: ఫ్రెంచి ప్రధాని మెండెస్‌ఫ్రాన్స్ నిన్న రాత్రి రాత్రి పారిస్‌లో బయలుదేరి ట్యూనిస్‌కువచ్చి, అక్కడనుంచి కార్థేజ్‌కు ప్రయాణమైవెళ్ళి, ట్యూనీషియా బేను కలుసుకొని, తాను ప్రకటిస్తున్న కొత్త సంస్కరణలను గూర్చి ఆయనకు వివరించిచెప్పి, ఈ సంస్కరణల అవసరాన్నిగూర్చి ఒక చిన్న రేడియో ప్రసంగంచేసి, తిరిగి ఇవ్వాళ్ళ ఉదయానికల్లా పారిస్‌కు చేరుకున్నారు.

ట్యునీషియాలో మెండెస్ ఫ్రాన్సు చేతో తాను ట్యునీషియన్లకు స్వాంతరాలను ప్రసాదించ దలచుకున్నానని ఒక్క దేశ సంరక్షణము, విదేశాంగ వ్యవహారాలుతప్ప తక్కిన అన్నివిషయాలను ట్యునీషియన్ల పరం చేయ దలచుకున్నానని చెప్పారు. అయితే ట్యునీషియా నిర్మాణంలో ఫ్రాన్సు తన పాత్రను, విధులను నిర్వహిస్తూ వుంటుంది. ట్యునీషియాలో ఫ్రెంచి వారికి శాసనసభలో ప్రత్యేక ప్రాతినిధ్యం వుంటుంది. వారు ఆ శాసనసభకుగాక రెసిడెంటు జనరల్‌కు బాధ్యులయి వుంటారు. ట్యునీషియా అరాచకాన్ని ఫ్రాన్సు బలప్రయోగంతో అణచివేస్తుంది అని ఆయన ఈబేకు తెలియజేశారు.

ట్యునీషియాకు ఫ్రాన్సు ప్రసాదిస్తున్న ఈ సంస్కరణలు ఫ్రాన్సు ఇచ్చుట ఎంతవరకు పోతుందో, చెబుతున్నా యేగాని, ఇవి వెంటనే అమలు జరుగుతాయనిమాత్రం ఎవ్వరూ భావించ నక్కరలేదని పరిశీలకులు అంటున్నారు. అయితే ఫ్రెంచి ప్రధాని, ఈ సంస్కరణలను ప్రకటించి, త్వరలోనే ట్యునీషియాలో ఎన్నికలకు ఏర్పాట్లు జరుగుతాయని స్పష్టం చేశారు. ఈ ఎన్నికల అనంతరం ట్యునీషియాలో ఒక ట్యునీషియన్ల శాసనసభ, ఒక ఫ్రెంచివారి శాసనసభ ఏర్పడతాయి. ఈ ఫ్రెంచివారి శాసనసభ రెసిడెంటు జనరల్ కేగాని, బేకుగాని, ట్యునీషియన్ శాసనసభకుగాని బాధ్యతవహించి పనిచెయ్యదు. అదీకాక ట్యునీషియా పరిపాలనలో గూడా దీనికి జోక్యం ఏమీ వుండదు. ట్యునీషియాలో దాదాపు 165000 మంది ఫ్రెంచివారు వున్నారు.

మెండెస్ ఫ్రాన్సు యీ ప్రతిపాదనలతో తిన్నగా కలుసుకోగానే, యీ దినం ట్యునీషియా చరిత్రలోనే చాలా సుదినం అన్నారు. నీవంటివాడు ఫ్రాన్సుకు ప్రధాని కావడం మా అదృష్టం అని అన్నారు. అంతేగాక ఆయనకు బే ఒక రత్నఖచితమైన చేతికడియాన్ని బహూకరించారు. వీరిద్దరి మధ్య 50 నిమిషాలు సమావేశం జరిగింది. ఈ సమాలోచనలకు బేగారి పెద్దకుమారుడు బాడే రాజపుత్రుడు గూడా హాజరైనారు. 1952 అనంతరం రాజకీయాల్లో తిరిగివచ్చి నే ఈయన ప్రవేశించారు.

పూర్వపు ఫ్రెంచి ప్రభుత్వాల చేత బహిష్కృతుడై పారిస్‌లో వుంటున్న ట్యునీషియా జాతీయ నాయకుడు హబీబ్ బోర్గుయిబా యీ సంస్కరణలను గూర్చి ఒక ప్రకటన చేస్తూ మెండెస్ ఫ్రాన్సు యీ సంస్కరణలను ప్రసాదించి, ట్యునీషియా స్వాతంత్ర్యానికి ఇది రాచబాట కాగలదని భావిస్తున్నామని అన్నారు. ట్యునీషియా ప్రజల లక్ష్యం సంపూర్ణ స్వాతంత్ర్యం ఆ లక్ష్యాన్ని ఇక యుద్ధాలతోను, తిరగబాటలతో నుగాక, స్నేహంతో ఇచ్చిపుచ్చుకోడాలతో ట్యునీషియా ప్రజలు, ఫ్రాన్సు కలిసి తేల్చుకుంటారు. ఫ్రెంచి ప్రజలను, ట్యునీషియా ప్రజలను, సహయోగ్యంలో, సహకారంలో ఇది కొనసాగుతుంది అన్నారు.

మెండెస్ ఫ్రాన్సు యీసంస్కరణలు అమలులోకి రావాలంటే, ముందుగా దీన్ని ఫ్రెంచి పార్లమెంటు ఆమోదించాలి. ఆతర్వాత ట్యునీషియా ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసి, ఈసంస్కరణలను అమలు జరపడానికి, దానితో తగిన ఒప్పందాలు ఆఖరు చేసుకోవాలి ఇక ఈసంస్కరణలు గూర్చి చర్చించేందుకు, ఇండియాలోని ఫ్రెంచి స్థావరాల సంగతి విచారించేందుకు ఫ్రెంచి పార్లమెంటు రేపు మంగళవారంనాడు సమావేశమౌతోంది.

### కొరియా వియత్నాంల విభజనలు

#### బెడెల్‌స్మిత్ ప్రవచనం

వాషింగ్‌టన్, ఆగస్టు 1: కొరియాను గాని వియత్నాంను గాని విభజన చేయడం రాజకీయంగా శాశ్వతమైన పరిష్కార మార్గాలని అమెరికా అంగీకరించదని అమెరికా ఉపవిదేశాంగ మంత్రి బెడెల్‌స్మిత్ నిన్న టెలివిజన్ గోష్ఠిలో వ్యక్తపరచారు.

కమ్యూనిస్టు దురాక్రమణపై తీసుకొనబడిన కఠిన సైనిక చర్యలవల్ల, రూపొందించిన యుద్ధ విరమణ సరిహద్దులుగా మాత్రమే వాటిని తాము అంగీకరిస్తామని ఆయన స్పష్టపరచారు.

ఇప్పుడు వియత్నాంలో జరిగిన విభజన అసంతృప్తికరమయినదిగా అభివర్ణిస్తూ, ఐక్యవియత్నాం అవతరణకై ఎన్నికలు జరిపించగలమని ఇరుపక్షాలూ వాగ్దానం చేశాయి కాబట్టి, పరిష్కార మార్గం దొరకగలదని కొద్దిగా ఆశాభావం కలుగుతున్నదనీ, అయితే కమ్యూనిస్టులు చిత్తశుద్ధితో వ్యవహరిస్తారో లేదో తేలవలసి ఉన్నదనీ ఆయన అన్నారు.

### దేశంలో ప్రేలుడు పదార్థాల ఫాక్టరీ

#### బ్రిటిష్‌సంస్థతో భారత ప్రభుత్వ ఒప్పందం

కలకత్తా, జూలై 29: నాలుగుకోట్ల రూపాయల మదుపుతో ప్రేలుడు పదార్థాల ఫాక్టరీని నిర్మించటానికి భారత ప్రభుత్వం ఒక ప్రసిద్ధ బ్రిటిష్ సంస్థతో ఒప్పందం కుదుర్చుకొన్నట్లు తెలియవచ్చింది.

బీహారులో బొగ్గు దొరికే ప్రాంతంలో నెలకొల్పే ఈ ఫాక్టరీ నిమిత్తం ఇండియన్ ఎక్స్‌ప్లోజివ్స్ లిమిటెడ్ అనేసంస్థను స్థాపిస్తారు ముందు పెట్టుబడిలో సగంమాత్రం వసూలు చేస్తారు. అందులో 60% బ్రిటిష్ సంస్థ, 20% భారత ప్రభుత్వం ఇస్తాయి. మిగతాది ఋణాలద్వారా సేకరిస్తారు.

## తిరువాన్కూర్ కొచ్చిన్ మంత్రివర్గ ఓటమి

### న్యాయ నిర్వహణ శాఖ పద్దుకు శాసనసభ తిరస్కృతి

తిరువనంతపురం, జూలై 31: తిరువాన్కూర్ కొచ్చిన్‌లోని ప్రజాసోషలిస్టు ప్రభుత్వం శాసనసభలో తొలిసారి నేడు పరాజయం పొందింది.

న్యాయశాఖ నిర్వహణకు సంబంధించిన పద్దు మెంటరీ డిమాండును ముఖ్యమంత్రి ప్రతిపాదించగా దానికి 14 ఓట్లు మాత్రమే అనుకూలంగా, 34 ఓట్లు ప్రతికూలంగావచ్చి అది తిరస్కరించబడింది. 27 మంది ఓటు చేయలేదు. అంటే ప్రభుత్వ పక్షస్థులు అనుకూలంగా, కాంగ్రెసువారు వ్యతిరేకంగా ఓటుచేయగా, కమ్యూనిస్టులు మొదలైనవారు తటస్థంగా వుండిపోయారు.

తరువాత కాంగ్రెసుపక్ష నాయకుడు తాము ఈడిమాండును ఓడించింది మంత్రివర్గంలో అవిశ్వాసం ప్రకటించేందుకు కాదనీ, తిరువనంతపురంలో మరో గవర్నమెంటు ప్లీడరును నియమించటంపట్ల తమ అనామోదాన్ని తెలపటానికేననీ ముఖ్యమంత్రికి తెలియచేశారు. కమ్యూనిస్టునాయకుడు థామస్ కూడా ఈ డిమాండు తిరస్కరణను మంత్రివర్గంలో అవిశ్వాసంగా పరిగణించనక్కరలేదన్నారు.

ఏమైనా ఇది యిట్లా జరిగింది కనుక ఇకముందు తాము ఏమి చేయాలనే విషయం నిర్ణయించుకొనేందుకు శాసనసభ ప్రజాసోషలిస్టుపార్టీ సమావేశం ఒకటి రేపు మధ్యాహ్నం ఏర్పాటు చేశారు. ఈ రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకూ మంత్రివర్గం యీ విషయమై తీవ్రంగా చర్చలు జరిపింది. ఢిల్లీలో వున్న ఆచార్య కృపలానికికూడా పరిస్థితిని వివరంగా తెలియచేసినట్లు తెలిసింది.

## భద్రాచల రామాలయాన్ని మరమ్మతు చేయించవలసిన అవసరం

### హైద్రాబాద్ ప్రభుత్వానికి ఆంధ్ర అర్థికమంత్రి జాబు

కర్నూలు, ఆగస్టు 1: భద్రాచలంలోని శ్రీరామాలయాన్ని మరమ్మతు చేయించవలసిన అవసరంగురించి ఆర్థిక మంత్రి, మహారాయ. ధర్మాదాయాలశాఖ మంత్రి అయిన శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు జాబు వ్రాశారు విశ్వనాథంగారు ఇటీవలనే భద్రాచలం వెళ్లి వచ్చారు. (స్వా. ప్ర)

## నాగర్‌హవేలీ ప్రధాన పరిపాలనాకేంద్రం సెల్వాసా విమోచన

### డామన్‌కు 700 సైనికుల రాక

డామన్, ఆగస్టు 1: 500 మంది నీగ్రో సైనికులూ, 200 మంది పోర్చుగీసు సైనికులూ రెండు మూడు రోజుల క్రితం డామన్ రేవులో దిగారని తెలుస్తోంది. వీరు వచ్చిన నౌకలో ఆయుధాలూ మందుసామగ్రీ కూడా తీసుకు వచ్చారనీ, ఇందులో 2 మెషీన్‌గన్‌లూ, పెద్ద ఫిరంగులూ కూడా ఉన్నవని తెలుస్తోంది.

అనుకోని అవాంతరాలు తట్టుకునే నిమిత్తం ఆహారపదార్థాలు పదునయోగ్యమైన తైలములూ కూడా ఈ ఓడలో దిగుమతి చేశారట.

ఇండియా డామన్‌పరిహద్దు పొడుగునా ఉన్న తిరికే కేంద్రాలకు అదరాబాదరాగా అదనపు పోలీసుబలాలను తరలిస్తున్నారని కూడా వార్తలు వస్తున్నవి.

ఇదివరలో కచిగోవా (వాపికి రెండు మైళ్ళ దూరంలో ఉన్నది) కేంద్రంలో ఇద్దరే సాయుధపోలీసులు ఉండేవారు. ఇప్పుడు అక్కడ 50 మంది సాయుధ పోలీసులు ఉన్నారు.

### డామన్ కుపోలీసుదళాధిపతిపలాయనం: జైళ్లలోని ఖైదీల విడుదల

వాపి, ఆగస్టు 1: పోర్చుగీసు అంకం నాగర్ హవేలీకి ప్రధాన పరిపాలనా కేంద్రం సెల్వాసా నిన్న రాత్రి విముక్తి పొందినదని నేటి ఉదయం వచ్చిన వార్తలు తెలుపుతున్నాయి. గోవా ప్రజాపార్టీవారు ఇందులోకి మొట్టమొదట ప్రవేశించి దీన్ని విముక్తి చేశారు.

అజాద్ గోమంతక దళంవారు తూర్పు, పడమర, ఉత్తరదిశలనుంచీ, గోవా ప్రజాపార్టీ దక్షిణ దిశనుంచి, పోటాపోటిగా దీనిపైకి దాడి చేశారు.

ఇక్కడి పోలీసుదళాధిపతి కెప్టెన్ పిగాటో కొత్తబలాలు తేవడానికి డామన్‌కు వెళ్ళిపోయాడు.

#### ఖైదీల విడుదల

వలంటీర్లు సెల్వాసాలో ప్రవేశించేసరికి, సెల్వాసా అధికారులు, ఖైదులో ఉన్న నేరస్థులనందరినీ విడిచి పెట్టేశారు.

పెద్దపెద్ద నేరాలుచేసిన ఈ ఖైదీలు ఇప్పుడు ఊళ్లో స్వేచ్ఛగా తిరుగుతున్నారు. వీళ్లందరినీ సైనికులుగా చేర్చుకోడానికి పోర్చుగీసు అధికార్లు ప్రయత్నిస్తున్నారట.

ఏదిఏమైనా, రక్తపాతం లేకుండా సెల్వాసా విమోచనం పొందింది. దీనితో పాటు నేడు మరి రెండుగ్రామాలను కూడా వలంటీర్లు విడిపించారు.

ఏ గ్రామానికి వెళ్లినా పోలీసులు పోట్లాటకు రావటంలేదు. వలంటీర్లు రాగానే దాసోహం చెబుతున్నారు.

#### నరోలీ తిరిగి పోర్చుగల్ వశం?

లిస్బన్, జూలై 31: నాగర్‌హవేలీలో ఇటీవలే విమోచనం పొందిన నరోలీ గ్రామాన్ని తిరిగి రెండురోజుల క్రితం పోర్చుగీసులు వశపరచుకున్నారని, లెఫ్టినెంట్ ఫాల్‌గోవా తనబలాలలో దీనిపైకి దాడి చేసి, ఇక్కడి 'భారతీయ సైనికులను' బందీలుగా పట్టుకున్నాడనీ, పోర్చుగీసు జెండా ఎగురవేశాడనీ, పోర్చుగల్ విదేశాంగశాఖ నేడు ప్రకటించింది.

#### గోవా విమోచనకు అఖిలపక్ష సంఘం

పూనా, జూలై 31: ఇండియాలోని పోర్చుగీసు వలసగోవాను పోర్చుగీసు బంధాలనుండి విడిపించడంలో గోవా ప్రజలకు సహాయపడ డానికై మహారాష్ట్రంలో అన్ని పక్షాలవారూ (కాంగ్రెసుతో సహా) కలిసి ఒక ప్రత్యేక సంఘం నెలకొల్పారు. దీనికి మహారాష్ట్ర ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు కె. ఎం. జెధీ అధ్యక్షుడు.

విరాళాలూ, వలంటీర్లూ యీ ఉద్యమానికి కావాలని కోరుతూ వీరు ప్రజలకు విజ్ఞప్తిచేశారు.

## "సత్యాగ్రహులపై పశుబలం ప్రయోగించవద్దు"

### విపరీత ఫలితాలను దారితీయగలదని పోర్చుగల్‌కు ఢిల్లీ హెచ్చరిక

న్యూఢిల్లీ, జూలై 31: ఇండియాలోని పోర్చుగీసు వలసలలో శాంతియుతంగా, అహింసాత్మకమైన స్వాతంత్ర్యోద్యమం సాగిస్తున్న సత్యాగ్రహులపై పోర్చుగీసు అధికారులు పశుబలం ప్రయోగించడం అఖిలభారత ప్రజానీకంలోనూ కలిగించే దారుణ ప్రభావానికి హద్దులుండవనీ, తత్ఫలితాలకు పరిమితి ఉండదనీ భారతప్రభుత్వం నేడు పోర్చుగల్‌కు హెచ్చరిక చేసింది. ఢిల్లీలోవున్న పోర్చుగల్ ప్రతినిధికి అందజేసిన ఒక లేఖలో ఈ హెచ్చరిక పొందుపరచబడింది.

పోర్చుగీసు వలసలలోని వ్యవహారాలను వాటి సహజ పరిణామాలను ప్రపంచం దృష్టిలో నానాగందరగోళంగా ప్రదర్శించడానికై పోర్చుగల్ నేడు అనుసరిస్తున్నది దుర్లక్ష్య లక్షితమైన విధానమనీ, స్వాతంత్ర్యం, ఇండియాతో విలీనం కోరే ప్రజల కాంక్షలనుఅణగద్రొక్క డానికి పోర్చుగల్ తీసుకుంటున్న చర్యలు ఎవర్నీ మోసంచేసి కళ్లు కప్పలేవని భారత ప్రభుత్వం ఆలేఖలో హెచ్చరించింది.

వాస్తవికతను అంగీకరించడానికి పోర్చుగల్ నిరాకరిస్తున్నది. వలసలలోని ప్రజలు విమోచనం కోరుతున్నారు. ఇండియాతో చేరిపోవాలనిప్రగాఢంగా వాంఛిస్తున్నారు. పోర్చుగల్ ఎంత నిరంకుశంగా ప్రవర్తించినా ఈప్రజల శక్తి అణచలేకపోయింది. తను అణచలేనంత బ్రహ్మాండమైన స్వాతంత్ర్యోద్యమం అవిర్భవించిందన్న ఈ సత్యాన్ని గుర్తించడానికి పోర్చుగల్ నిరాకరిస్తున్నది.

#### బెదరింపులు

పోర్చుగల్ పదేపదే బెదరిస్తూ వచ్చింది. స్వాతంత్ర్యంకోసం గోవా ప్రజలు సాగించగల శాంతియుతసత్యాగ్రహాన్ని, అదే దూరానైనా జరిగినా తాను తీవ్రంగా ప్రతిఘటించగలనని పోర్చుగల్ చేస్తూవచ్చిన బెదరింపులను తాను గుర్తించామని భారత ప్రభుత్వం ఈలేఖలో పేర్కొన్నది. ఈ పోర్చుగల్ ఉచ్చరించిన ఈ పదజాలాన్ని ప్రపంచాభిప్రాయానికి వదలిపెట్టడంతో తృప్తిపడే భారత ప్రభుత్వం ఊరకుంటున్నది.

అయితే, పశుబలప్రయోగం జరిపే వ్యాసంగా భారతీయులపై, గోవా ప్రజలలోనూ సహా, కలిగించే ప్రభావం దారుణంగా ఉంటుందనీ, దానికి హద్దులు ఊహింపరానివి అవగలవనీ భారత ప్రభుత్వం హెచ్చరిస్తున్నది.

### బెల్గాంకు భారతప్రతినిధుల ఆగమనం

బెల్గాం, జూలై 31: గోవాలోని భారతప్రతినిధి విన్సెంట్ కోయిలో, మార్మగోవాలోని ప్రతినిధి జె. ఎ. ప్రభృతులు నేడు వలసలు వీడి బెల్గాంకు

(3 వ పేజీ చూడుడు)

## విశాఖనౌకా కేంద్ర విస్తరణకు $5\frac{1}{2}$ కోట్లుఖర్చు పెట్టాలనిఆలోచన

### ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చవలసిన పరిశ్రమల వైనం

[ఆంధ్రపత్రిక విలేఖరి]

న్యూఢిల్లీ, జూలై 31: రెండో పంచవర్షప్రణాళికలో 19 కొత్త పరిశ్రమలను చేర్చాలని కేంద్ర ఉత్పత్తి శాఖ వారు ఆలోచిస్తున్నారు.

ఆ పరిశ్రమలు ఇవి:

(1) సింథటిక్ పెట్రోలు — 45 కోట్లు.

(2) రెండో ఉక్కు కర్మాగారం.

(3) భారీ విద్యుత్ పరికర నిర్మాణ కర్మాగారం.

(4) మెషినటూల్ కర్మాగారం.

(5) హిందూస్థాన్ షిప్‌యార్డు అభివృద్ధి—ఇందుకు 5 కోట్ల 50 లక్షలు ఖర్చు పెట్టాలని ఆలోచన చేస్తున్నారు

(6) ఫెర్రో మాంగనీసు.

(7) హిందూస్థాన్ కేబుల్ ఫాక్టరీ అభివృద్ధి.

(8) సైంటిఫిక్ పరికరాల కర్మాగారం అభివృద్ధి.

(9) సింద్రి ఎరువుల కర్మాగారం అభివృద్ధి.

(10) ఇంకో కొత్త ఎరువులఫ్యాక్టరీ.

(11) హిందూస్థాన్ అంటిబయాటిక్స్ అభివృద్ధి.

(12) రెండో డి. డి. టి. కర్మాగారం అభివృద్ధి.

(13) మందు ఉప్పుగనుల అభివృద్ధి.

లండన్, జూలై 30: బర్మాలో ఒయాసిస్సును గురించి తమ మధ్య పెరుగుతున్న తగాదాను పరిహరించుకుంటూ చేసుకున్న ఒప్పందంమీద బ్రిటన్, సాదీ అరేబియాలు నేడు జెడ్డాలో సంతకాలు చేసుకున్నారు.

### సట్లెజ్ నదీజలాల వినియోగం

#### పాకిస్తాన్ ప్రధానమంత్రి నిర్హేతు కారోపణలు

కరాచి, జూలై 31: ఇండియాలో బ్రకానాంగల్ కాల్వలను ప్రారంభించడంవల్ల పాకిస్తాన్ ఆహార పరిస్థితి పాడై, కాయకంపిర్పాటే బెడద ఏర్పడుతున్నదని పాకిస్తాన్ ప్రధాని మహమ్మదాలీ నేడు పాకిస్తాన్ ఆహార వ్యవసాయకసంఘం సమావేశాన్ని ప్రారంభిస్తూ అన్నారు:

ఇండియా ఈ కాల్వలను ప్రారంభించడంవల్ల సట్లెజ్ నదిలో నీటి పారుదల జూలైలో 22350 కూసెక్కులు వున్నది. ఇప్పుడు 9810 కూసెక్కులకు పడిపోయిందని, వర్షాలు అన్ని పడక పోయి వున్నట్లయితే ఈ పాటికే ఈ నదిలో నీరు ఎండిపోయి వుండేదని కూడా ఈయన ఈ సందర్భంలో చెప్పారు.

పంజాబునదుల విషయంలో తాము ఎంతో మర్యాదగా వ్యవహరిస్తున్నామని, ఇండియాలో ఈతగాదాను గురించి సమరసమున్నా, శాంతియుతమున్నా అయిన విధంగా సమాధాన కుదుర్చుకోడానికి చూస్తున్నామని, భగవంతుని దయవల్ల ఈ సమస్య సవ్యంగా పరిష్కారం అవుతుందనే ఆశిస్తున్నామని గూడా ఆయన అన్నారు.

# అస్సాం బీహారు వరదబాధితులకు సత్వర సహాయావశ్యకత

## నిరాశాలివ్వాలని నెహ్రూ విజ్ఞప్తి

## వరద బీభత్సం: కొన్ని వివరాలు

న్యూఢిల్లీ, జులై 31 అస్సాం, బీహారులలోను ఇతర త్రానూ వరదలవల్ల ఇక్కట్లకు లోనైన ప్రజానీకానికి సహాయం చేసే నిమిత్తం దేశంలో యావన్మందీ ప్రధానమంత్రి జాతీయ సహాయనిధికి సత్వరమే ఉదారంగా విరాళాలివ్వాలని ప్రధాని నెహ్రూ నేడు అభ్యర్థించారు.

ఆయారాష్ట్రాలలో వరదలవల్ల కలిగిన కష్టనష్టాలగురించి వస్తున్న వార్తలు అందరినీకూడా సత్వరావశ్యకమైన సహాయం చేయటానికి పురికొల్పాలనీ, ఇటువంటి ఆపదలప్పుడు వినియోగింపబడే ప్ర. జా. స. నిధి దాదాపు అంతా అయిపోయిందనీ, కనుక ప్రజలు వెంటనే ఉదారంగా విరాళాలివ్వాలని ఆయన విజ్ఞప్తిచేశారు.

### బీహారులో విపరీత కష్టనష్టాలు

పాట్నా, జులై 31. కోసీ మొదలైన నదులు పొంగి ప్రవహిస్తున్నందున ఉత్తర బీహారులో దాదాపు 4 వేల చదరపుమైళ్ళ ప్రాంతం జలమయమైపోయింది. దాదాపు 15 లక్షల ప్రజలు కష్టనష్టాలకు లోనైనారు. 70 వేల పైచిలుకు ఇండ్లు పడిపోయాయి. ఇంచుమించు లక్షఎకరాల భూమి పైరులు నాశనమైపోయాయి. దర్భాంగ్ డివిజనులో దాదాపు 12 మంది నీటిలో మునిగి చనిపోయారు. పాములుకరచి చాలామంది మరణించినట్లు తెలుస్తున్నది. ఒక గ్రామస్థుడు నారాయణినదిలో 7 మైళ్ళు కొట్టుకుపోయి ప్రాణాలతో రక్షింపబడినాడు. ఛాంపరాన్, ముజఫర్‌పూర్, దర్భాంగా, సహార్సా, మూంఘిర్ జిల్లాలనుంచి వచ్చే వార్తలనుబట్టి ప్రజలు ఇళ్ళకప్పులపైనా, చెట్లపైనా అట్లాంటి మెట్టప్రదేశాలలోనూ నివసిస్తున్నట్లు తెలుస్తున్నది. కొన్ని పట్నాలలో వీధులన్నీ కాలవలైపోయి పోట్లు నడుస్తున్నాయి.

అధికారులు నష్టం ఎంతో అంచనా కూడా వేయలేకుండా వున్నారు. అనధికారులు చాలా లక్షల నష్టం వాటిల్లిందంటున్నారు. కోసీనదిలో ఈ ఏడాది మామూలుకంటే ముందుగా, అకస్మాత్తుగా వరదలు వచ్చాయనీ, అందుచే ప్రజలూ, పశువులూ సురక్షిత ప్రాంతాలకు చేరే సావకాశం లేకపోయిందనీ అంటున్నారు. కోసీనీళ్లు చాలా ఉపద్రవమైనటువంటివిట మనుష్యులకూ, జంతువులకూ కూడా జబ్బులు చేసాయట. చెట్లుకూడా ఆ నీరు తగిలితే మాడి చక్కాపోతాయట. నిజమో కాదో తేలలేదు కాని ఈ నీరు తాగినవారికి పిల్లలు పుట్టరట.

ఈ నదులు ఇంకా పొంగుతూనే వున్నాయి. ప్రభుత్వము ఉద్యోగుల ద్వారా ఇతరుల ద్వారా సహాయ కార్యాలు జరిపిస్తున్నది. ఈ పరిస్థితిని గురించి చర్చించటానికి అగస్టు 3 వ మంత్రిమండలి సమావేశం కానున్నది.

### అస్సాంలో 10 చావులు

షిల్లాంగ్, జులై 31 అస్సాంలో వచ్చిన అపూర్వ వరదలవల్ల ఇంతవరకూ 10 చావులు సంభవించినట్లు తెలిసిందని డిప్యూటీమంత్రి ఒకరు ఇవ్వాళ శాసనసభలో తెలిపారు. లఖింపూర్ జిల్లా మరీ విపరీత నష్టానికి గురి అయిందనీ, గోల్పారా జిల్లాలో విస్తారమైన ప్రాంతాలు నీటమునిగిపోయి, ప్రజలుగాక గుట్టలపై తలదాచుకొంటున్నారనీ, ఆ జిల్లాలో పైరుకు కలిగిన నష్టం కోటిరూపాయలకు మీరి వుంటుందనీ, దుర్భిక్షపట్నం జలపరివేష్టితమయిపోయిందని అన్నారు. దారాంగ్ జిల్లాలో 3 గ్రామాలు తుడిచి పెట్టుకుపోయాయి, శివసాగర్‌లో 30 కుటుంబాలు నిరాశ్రయులైపోయాయి. లక్ష్మీపురం జిల్లాలో సుమారు 100 చ. మైళ్ళమేర నీట మునిగిపోయి 10 వేల ప్రజ ఇక్కట్లకు లోనైనారు. డిబ్రూగడ్ పట్నం ఇంకా ముంపుకు గురి అయేవుంది. పోలీసుదళాలను అక్కడ్నించి తరలించి వేశారు. నవగాంగ్‌లో సుమారు 400 చ. మైళ్ళమేర విపరీతనష్టానికి గురి అయి, పశువులు, ధాన్యం, జనసనావాసాలు, పైరూ ధ్వంసం అయిపోయాయి. ప్రభుత్వం పరిస్థితిని బాగా తెలుసుకొని వలసిన సహాయంఅంతా శీఘ్రంగా చేయిస్తోంది అని ఆయన అన్నారు.

### నేపాల్‌లో 50 మంది చనిపోయిన వైనం

ఖట్మండూ, జులై 31: నేపాల్‌లో ఇటీవల వరిసిన విపరీతవర్షాలమూలంగా వరదలు, నేల కుంగిపోవటాలూ, ఇళ్లు పడిపోవటాలూ జరిగి ఒక 50 మంది చనిపోయినట్లు తెలిసింది. ప్రధాని కొయిరాలా ప్రభుత్వానికి అందిన సమాచారాన్నిబట్టి ప్రభుత్వాధివనాలకు వాటిల్లిన నష్టమే 20 లక్షలుంటుంది [illegible] లక్షలుంటుందని అన్నారు. [illegible] మొదలైన నదుల వరదలవల్ల తూర్పు తెరాయి ప్రాంతంలో సుమారు 100

[గ్రా]మాలు మునిగిపోయాయనీ, ప్రభుత్వం సహాయ కార్యక్రమాలు ప్రారంభించిందనీ అన్నారు.

### కూచ్ బిహార్‌లో ముంపు తీత

కలకత్తా, జులై 31: కూచ్‌బిహార్ నుంచి వచ్చిన తాజావార్తలు అక్కడ ముంపుతీస్తున్నట్లు తెలుపుతున్నాయి. అయితే పట్నంలో కొన్ని భాగాలు ఇంకా నీటిలోనే వున్నాయట. ఆలీపూర్-కూచ్‌బిహారుల మధ్య రైల్వే రాకపోకలు తిన్నగా ప్రారంభమైనాయి. వరదప్రాంతాలలో 80 చావులు సంభవించినట్లు ఇంకా తెలియలేదని పశ్చిమ బెంగాల్ ప్రభుత్వ ప్రతినిధి ఒకరు తెలిపారు.

బ్రహ్మపుత్రా నది వరదలవల తూర్పు బెంగాలులోని మైమెన్‌సింగ్ జిల్లాలో సుమారు 20 వేల ఎకరాల సాగుకు లాయకైన భూమి మునిగిపోయిందనీ, వందలాది ఇళ్లు మునిగిపోయాయనీ ఢాకానుండి వార్తలు అందాయట.

### తూర్పు జర్మనీ ప్రధాని సానుభూతి

భారతదేశంలో వరదలవల్ల ఇక్కట్లకు లోనైనవారికి తమ సానుభూతి వెల్లడించ గోరుతూ తూర్పు జర్మనీ ప్రధాని హెర్ ఒట్టో గ్రాట్వోల్ ప్రధాని నెహ్రూకు సందేశంపంపారు.

### పర్షియాలో వరదలు

టెహరాన్, జులై 31: యీ నగరానికి వాయవ్యాన 60 మైళ్ళలో గల గాజ్విన్ ప్రాంతంలో వరదలు వచ్చి 150 మంది ప్రజలు చనిపోయారు. 15 గ్రామాలు తుడిచిపెట్టుకు పోయాయి 100 మంది ప్రజలు పతా తెలియటంలేదు. 400 మంది గాయపడ్డారు. వేలాదిమంది నెలవులు కోల్పోయారు. 50 ఏండ్ల యీ మధ్య ఇంత ఘోరమైన వరదలు రాలేదు.

# దేశ పునర్నిర్మాణం పట్ల ప్రజల శ్రద్ధ

## ప్రభుత్వం చేసిన ఖర్చు మించి ఎక్కువ సహాయం చేసిన వైనం

న్యూఢిల్లీ, జులై 31: క్రిందటి అక్టోబరులో దేశం వివిధప్రాంతాలలో ఆరంభించిన పునర్నిర్మాణ కార్యక్రమానికి మొదటి 6 నెలలలోనూ ప్రజలు ఇచ్చిన డబ్బుగానీ, పనిలో చేసిన తోడ్పాటుగానీ ప్రభుత్వం అందుకు చేసిన ఖర్చుకంటే చాలా ఎక్కువని ఇందుకు సంబంధించి తయారు చేయబడిన నివేదికవల్ల తెలుస్తోంది.

ఈకార్యక్రమం దేశంలో 210 చోట్ల ప్రారంభించారు. అన్నిచోట్లా కలిసి ప్రభుత్వం యీఆరు నెలల్లో 42.99 లక్షల రూ. లు ఖర్చుచేశారు. ప్రజలద్వారా లభించిన తోడ్పాటు అయితేనేమి, పైకమైతేనేమి, భూమి అయితేనేమి అంతాకలిసి 45.80లక్షలు.

ఈ 6 నెలల్లో యీ కార్యక్రమం ద్వారా సాధించిన దేమిటంటే 78000 ఎకరాల భూమిని సాగుచెయ్యటం. 16000 ఎకరాలను కూరగాయలు, పళ్లు పైరుచెయటానికి అనువుగా మార్చటం. మరి సుమారు 19000 ఎకరాలను ఇతర విధ వ్యవసాయాభివృద్ధిపనులకు లాయక్ చేయటం. పశుపోషణ విషయంలో ఆబోతులను సప్లయిచేయటం, వ్యాధి నివారణ వుపాయాలు సమకూర్చటం మొదలైనవి చేశారు. 3886 నూతులను బాగుచేశారు. 681 కొత్త నూతులు తవ్వించారు. ప్రజారోగ్య సంరక్షణ సంవర్ధనంలో పాకీదొడ్లు కట్టించటం, మురుగుకాల్వలు తీయించటం చేశారు. 1040 కొత్త పాఠశాలలను ప్రారంభించారు. 131 పాఠశాలలను ప్రాథమిక విద్యాశాలలుగా మార్చారు. దాదాపు 1200 వయోజన విద్యాకేంద్రాలుకూడా ప్రారంభించారు. దాదాపు 1800 మైళ్ళరోడ్లు వేయటమైంది. 445 సహకార సంఘాలు స్థాపించారు.

### కీ॥ శే॥ డా॥ రత్నమ్మగారు

నెల్లూరు, జులై 27: ఇక్కడి అమెరికన్ ఆస్పత్రిలో 28 సం॥రాలుగా సూపరింటెండెంటుగా పనిచేసిన డా॥ [illegible] యీ నెల 22 వ తేదిని పోయినది. [illegible] యీమె చాలా ప్రసిద్ధికెక్కినది.

# ఢిల్లీరాష్ట్రప్రభుత్వ ఉపమంత్రులిద్దరికీ ఉద్వాసన

న్యూఢిల్లీ, జులై 30: ఢిల్లీ రాష్ట్రప్రభుత్వ మంత్రివర్గంలోని ఇద్దరు ఉపమంత్రులను జులై 31 వ తేదీన పదవుల నుండి తొలగించటం జరుగుతుందని ఢిల్లీ ముఖ్యమంత్రి బ్రహ్మప్రకాశ్ నేడు ప్రకటన చేశారు.

ఢిల్లీ రాష్ట్రానికి ఇప్పుడున్న ముగ్గురు మంత్రులూ, ఇద్దరు ఉపమంత్రులూ మరీ ఎక్కువభారమనీ, అందువల్ల ఉపమంత్రులను తొలగించటం మంచిదనీ కాంగ్రెసు అధ్యక్షుడు ప్రధాని నెహ్రూ చేసిన సిఫార్సుకు అనుగుణంగా ఈ చర్యతీసుకోవటబడుతున్నదట. ఈ ఉపమంత్రులు మిస్ శాంతవశిష్ఠ, శివచరణ్‌గుప్తగార్లు తన మంత్రివర్గంలో ఉండి అన్నివిధాలా సహకరించారని ముఖ్యమంత్రి అన్నారు.

తొలగింపువిషయంలో తొందరపడరాదనీ పరిపాలనాసౌలభ్యంచూచుకుని, తాను ఈ చర్య తీసుకోవలెననీ ముఖ్యమంత్రి బ్రహ్మప్రకాశ్ చెప్పారు.

### ఒరిస్సా, ఆంధ్ర రవాణాశాఖ కమిషనర్ల చర్చలు

కర్నూలు, జులై 31: ఒరిస్సా, ఆంధ్ర ప్రభుత్వాల ట్రాన్సుపోర్టు కమిషనర్లు ఆగస్టు 12 వ తేదీన సరిహద్దు సమీప ప్రాంతాల్లో నడిచే బస్సుల ఏర్పాట్లగూర్చి వాల్తేరులో సమావేశమై చర్చించగలరని తెలుస్తోంది. ఒరిస్సా ప్రభుత్వంవారు బస్సులను కొన్నిటిని జాతీయం చేసిఉన్నారు. ఆ రూట్లు ఆంధ్ర ప్రాంతాలలోకి విస్తరించదలచుకున్నారు. దాన్నిగూర్చి సంప్రదింపులు జరుగగలవు.

ఇంతవరకు ఆంధ్ర రాష్ట్రంలో 4,263 బస్సులు, 111 విడిబస్సులు, 5,946 లారీలు ఉన్నవి. ప్రయివేటు కార్లు 3,950, టాక్సీలు 115, మోటారు సైకిళ్లు 1,200 ఉన్నవి.

# శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం

## ఈ నెలలో ప్రారంభోత్సవం జరిగే అవకాశం

కర్నూలు, ఆగస్టు 1: తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి యీ నెలలో ప్రారంభోత్సవం జరుగుతుందని విద్యాశాఖ మంత్రి ఎస్. బి. పి. పట్టాభి రామారావుగారు నిన్న సాయంకాలం ఇక్కడ జరిగిన పత్రికా విలేఖరుల సమావేశంలో అన్నారు. విద్యాశాఖ మంత్రి బెంగుళూరు వెళ్లి యీ వ్యవహారం గురించి ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంపంతులుగారితో సమాలోచనలు జరిపి నిన్న మధ్యాహ్నం ఇక్కడికి తిరిగి వచ్చారు.

శ్రీ వెంకటేశ్వర విశ్వకళాపరిషత్తు ఛాన్సలరూ, ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి అయిన శ్రీ క. సుబ్బారావుగారితో సంప్రదించి యీ విశ్వవిద్యాలయం ప్రారంభోత్సవ తేదీని అందుకు సంబంధించిన ఇతర విషయాలనూ నిర్ణయిస్తామనికూడా మంత్రి పట్టాభి రామారావుగారు అన్నారు. (స్వ. వి.)

### తిరుపతికి ఉప ముఖ్య మంత్రి ఆగమనం

తిరుపతి, జులై 31: ఉప ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డిగారు యిదటకు యీ మధ్యాహ్నం వచ్చారు. జిల్లాకలెక్టరు శ్రీ యాగంటి డి. ఎస్. పి. శ్రీరామచంద్రా రెడ్డిగార్లు స్వాగతమిచ్చారు.

పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ శ్రీ సంజీవరెడ్డి, ఆగస్టు 15 అనంతరం శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి ప్రారంభోత్సవం జరగలదని చెప్పారు. పిదప స్పెషలాఫీసరు శ్రీ రంగథామరావుగారితో చర్చలు జరిపారు.

తిరుపతి విశ్వవిద్యాలయానికి ప్రారంభోత్సవం జరుపవలసినదిగా ప్రస్తుతం మైసూరులో వున్న రాష్ట్రపతి బాబూ శ్రీ రాజేంద్రప్రసాదును ఆంధ్ర మంత్రులు శ్రీ పట్టాభి రామారావు, విశ్వనాథం, ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంగార్లు కోరగలరని తెలుస్తున్నది. (స్వ. వి.)

# లావోస్, కాంబోడియాలలో చెదరివున్న సేనల సమీకరణ

## యుద్ధవిరమణ పర్యవేక్షణ సంఘ ప్రథమ కర్తవ్యం

న్యూఢిల్లీ, జులై 31: ఇండోచైనాలో యుద్ధ విరమణపై పర్యవేక్షణకు నెలకొల్పబడిన సంఘంవారు రేపు ఉదయం ఇక్కడ తొలిసారిగా సమావేశం కాబోతున్నారు. యీ సంఘంవారి ప్రాథమిక కార్యకలాపాలు సైనికమైనవిగా ఉంటవనీ, వీరి ప్రథమ కర్తవ్యం లావోస్ కాంబోడియాలలో చెల్లాచెదురుగా ఉన్న ఇరు పక్షాల సేనలను సమీకరించి, యుద్ధ విరమణ సరిహద్దును అటూ ఇటూ పంపడమేననీ తెలుస్తూంది.

ఇందు నిమిత్తం ఇండియా కెనడా పోలెండుల ప్రతినిధులతో కూడిన అనేక పరిశీలన సంఘాలు ఇండోచైనాకు పంపబడగలవట.

### విదేశవ్యవహారాల సంఘం చర్చలు

పర్యవేక్షణ సంఘంలో ఇండియా అధ్యక్షతను దృష్టిలో పెట్టుకుని, ఇండోచైనా యుద్ధ విరమణ ఒప్పందాన్ని భారత ప్రభుత్వ విదేశ వ్యవహారాల సంఘంవారు సమగ్రంగా పరిశీలించారు. ఇందుపై జరిగిన సుదీర్ఘ చర్చలలో వి. కె. కృష్ణమీనన్ కూడా పాల్గొన్నారు.

ఇంతకు ముందు ప్రధాని బసలో జరిగిన రక్షణ వ్యవహారాల సంఘ సమావేశానికి కూడా కృష్ణమీనన్ హాజరైనారు.

రేపు జరుగనున్న సమావేశ కార్యక్రమంగురించి ఇంతవరకూ ఎట్టి నిర్ణయాలూ జరుగలేదు. యీ సంఘానికి ఇండియా అధ్యక్షత వహించినా, మిగతా రెండుదేశాలకూ కూడా (కెనడా, పోలెండ్) సమాన అధికారాలుంటవని, రేపటి కార్యక్రమంకూడా రేపటి సమావేశంలోనే నిర్ణయించబడుతుందనీ తెల్సొస్తున్నది.

రేపుసమావేశాన్ని ప్రధాని నెహ్రూ ప్రారంభిస్తారు. అప్పైన 1956 వ సంవత్సరాంతానికి వియెట్నాంలో జనరల్ ఎన్నికలు జరపడాన్ని అంత్య లక్ష్యముగా పెట్టుకొని, ఈరెండు సంవత్సరాలలోనూ అమలు జరపవలసిన కార్యక్రమాలను నిర్ణయించడం జరుగుతుంది ఇండోచైనాలోని మూడురాష్ట్రాలకూ మూడు పర్యవేక్షణ సంఘాలు నెలకొల్పేవిధానం, మొదలైన విషయాలు రేపు చర్చించుతారు.

ఈసంఘంవారు ఈవారం పొడుగునా సమావేశాలు జరుపుతారు. సభ్యదేశాలు మూడూ తయారుచేసిన కార్యాలిక కార్యక్రమాలు పరిశీలించడం, ఇండోచైనాకు వెళ్ళే మూడు పర్యవేక్షణ సంఘాలలోనూ రెండేసిప్పుడూ వునా వుండే కార్యం ప్రతినిధులూ, వారు హాజరుకాని సమయాలలో వారికి బదులుగా వ్యవహరించవలసిన ప్రతినిధులనూ నిర్ణయించడం ఈవారంలోనే జరుగుతుంది.

మూడు పర్యవేక్షణసంఘాల కార్యకలాపాలూ సాఫీగా జరిగిపోడానికి అనువుగా, సవివరమైన కార్యక్రమాలు ఇప్పుడే రూపొందించుతారు.

లోగడ కొరియా విషయంలో వహించిన భాధ్యత వలె, ఈసారి ఇండియా సేనలను పంపనక్కరలేదు.

ఇండోచైనాలోని సేనలను పోగుచేసి, ఏపక్షంవారు ఆ వైపుకు యుద్ధ విరమణ హద్దువాటి వెళ్లడంపైన పర్యవేక్షణకై పరిశీలక సంఘాలు పంపడం జరుగుతుంది.

యుద్ధ విరమణ ఉల్లంఘించబడితే వీరు దర్యాప్తు జరుపుతారు.

### రేపటి సమావేశం

రేపటి సమావేశంలో ప్రధాని నెహ్రూ కృష్ణమీనన్‌లు కాక, ఇండియా తరఫున, ఎన్. ఆర్. పిళ్లై, ఆర్. కె. నెహ్రూ, ఎం. కె. వెల్లోడి (రక్షణ కార్యదర్శి) ఎస్. దత్తు (రక్షణ కార్యదర్శి) గార్లు పాల్గొంటారు.

కెనడా ప్రతినిధులు నేటి రాత్రి ఇక్కడికి చేరుకుంటారు. పోలెండ్ ప్రతినిధులు ఒకరోజుఆలస్యంగా వస్తారు కాబట్టి, రేపటి సమావేశంలో ఢిల్లీలో ఉన్న పోలెండ్ రాయబారి పాల్గొంటారు.

ఈ ప్రారంభ సమావేశం ముగిసిన తరువాత ఫ్రాన్సు, వియెట్నాం, కాంబోడియా, లావోస్ ప్రతినిధులకు ప్రధాని తేనీటివిందు చేస్తారు. వీరందరూ ప్రస్తుతం ఢిల్లీలోనే ఉన్నారు.

వియెట్మిన్ ప్రతినిధులు నేడో రేపో వస్తారు.

ఈ సమావేశానికి ఇంకా ఈ క్రింది వారు హాజరవుతారని తెలుస్తుంది.

కెనడా: ఎస్కాట్, ఎం. రీడ్ (హైకమిషనర్), ఆర్. ఎం. మాక్డొనెల్, హెచ్. పి. రట్ లెడ్జ్, బ్రిగేడియర్, ఆర్. ఇ. ఎ. లార్సన్, బి. ఎం. విలియమ్స్.

పోలెండ్: పి. ఓగ్రోజెనస్కీ, జార్జి జెనిస్కీ (రాయబారి), హెచ్. జోలో.

ఫ్రాన్సు: కౌంట్ స్టానిస్లాస్ అస్ట్రొరాగ్, జనరల్ డిబ్యూపోర్ట్, గిల్లస్.

వియెట్నాం: న్గోదావ్ దాయ్, న్గుయెన్ కౌంగ్ ఫు, లూవియెన్, కల్నల్ కిమ్.

కాంబోడియా: కల్నల్ సోన్‌శాన్, కమాండెర్ సుఖ్ సుస్టోభాక్.

లావోస్: మేజర్ సిసోసనా [illegible].

వియెట్నాం రిపబ్లిక్: హోవాంగ్ నావ హావాన్. కల్నల్ [illegible] వాంగ్ న్గొ యెన, హావ భాన్, [illegible].

# పోర్చుగల్‌కు భారత ప్రభుత్వ హెచ్చరిక

(1 వ పేజీ తరువాయి)

సురక్షితంగా చేరుకున్నారు.

కాన్సల్ జనరల్ విన్‌సెంట్ కోయెల్హో బెంగుళూరు మెయిలులో ఇక్కడికి రాత్రి ఎనిమిదిగంటలకు చేరారు.

గోవాలో తన కార్యాలయంనుంచి ఉదయం 10 గంటలకు బయలుదేరారు. 11-55 నిముషాలకు, పోర్చుగల్ నిర్ణయించిన గడువు 5 నిముషాలు ఉందనగా అన్‌మోడ్‌వద్ద వలస సరిహద్దు దాటి భారత ప్రాంతంలోకి ప్రవేశించారు.

ఈయన బెల్గాం చేరడానికి ముందుగానే, మార్మగోవానుంచి జి. ఎ. ప్రభుకొరులో వచ్చారు.

గోవాలోని తన కార్యాలయం ఇంకా పనిచేస్తూనే ఉంటుందనీ, అక్కడి సిబ్బందిలోకి ఉన్న తాధికారి దాన్ని నిర్వహిస్తాడనీ కోయెల్హో చెప్పారు.

పోర్చుగల్ తనపైవేసిన అభాండాలపై ఈయన వ్యాఖ్యానం చెయ్యలేదు. తిన్నగా ఢిల్లీ వెళ్లి భారత ప్రభుత్వానికి వలసల పరిస్థితులు వివరించబడుతుంధని మాత్రం ఆయన అన్నారు.

ఈయన వచ్చిన రైలులో గోవానుంచి 50 కుటుంబాలవారు దిగారు.

వీరిలో చాలామంది గోవా పరిస్థితులను విలేఖరులకు వివరించి చెబుతూ, వలసలలోని భారతీయులను ఎలాగైనా వెట్టిచెయ్యడానికి అక్కడి అధికారులు ప్రయత్నిస్తున్నారనీ, దీనివల్ల 10 వేలమంది కార్మికులకు దెబ్బఅనీ చెప్పారు.

### భారతప్రభుత్వ అభియోగం

బొంబాయిలోని పోర్చుగీసు ప్రతినిధులు గోవా చేరేవరకూ, గోవాలోని భారత ప్రతినిధులను పోనివ్వకుండా పోర్చుగీసు అధికారులు ఆటంకపరచారన్న వార్త విని, భారత ప్రభుత్వ విదేశ వ్యవహారాల సంయుక్త కార్యదర్శి పి. ఎస్. ఝా పోర్చుగీసు ప్రతినిధిని కలుసుకుని, ఈ వార్త నిజమైతే, నేటి ఉదయమే పోర్చుగల్ ఇచ్చిన హామీకి ఈ చర్య విరుద్ధంగా భావించవలసివస్తుందనీ, ఇట్టి ధోరణి అవలంబించకోదసియనీ అన్నారు.

గోవాలోని భారతప్రతినిధిని హత్యచేయడానికి కొందరు దుండగులు ప్రేరేపించబడుతున్నారని 4 రోజులక్రితం వచ్చినవార్తలు పురస్కరించుకుని, భారతప్రభుత్వం పోర్చుగల్‌కు ఒక హెచ్చరిక పంపింది.

తాము విన్నవార్తలు నిజం అయి ఉండవనే భావిస్తున్నామనీ, అయితే, తమ ప్రతినిధికి గోవాలో ఎట్టి హాని జరిగినా పర్యవసానాలు తీవ్రంగా ఉండగలవనీ అందులో పేర్కొంది.

భారతప్రతినిధులు, వారి సిబ్బందీ, వారందరి కుటుంబాల భద్రత పట్ల పోర్చుగల్ హామీ ఇవ్వాలని కూడా భారతప్రభుత్వం కోరింది.

### పోర్చుగల్ ప్రతినిధుల నిర్గమనం

బొంబాయి, జులై 31: బొంబాయిలోని పోర్చుగల్ ప్రతినిధులు ఇద్దరూ కుటుంబ సమేతులై పూనాకు బయలుదేరారు.

విక్టోరియా రైల్వేస్టేషనులో పోర్చుగల్ ప్రతినిధి డా॥ పిరేరాసిమోవిలే కరులకు సెలవుచెపుతూ తాను బరువెక్కిన హృదయంతో బొంబాయి వదలి వెళ్తున్నాననీ, తనకు ఇప్పుడు ఎన్నో చెప్పాలని ఉన్నా, పరిస్థితులు అనుగుణంగా లేవనీ అన్నారు.

విలేకరులు తనపట్ల చూపిన స్నేహభావానికి హర్షం తెలుపుతూ నిజానికి దీనివల్ల తను ఇరకాటంలో పడినట్లయిందనీ, ఏమవాలో తోచలేదనీ డా॥ పిరేసిమో అన్నారు.

రైలు బయలుదేరుతుండగా "స్వతంత్ర భారతానికి ఇదే నా వీడ్కోలు" అని ఆయన అన్నారు.

### పోర్చుగీసు యుద్ధనౌకకు కరాచీ ఆశ్రయం

కరాచీ, జులై 31: తూర్పు ఆఫ్రికాలోని పోర్చుగీసు ప్రాంతం నుండి, ఇండియాలోని పోర్చుగీసు వలస గోవాకు ప్రయాణం చేస్తున్న ఒక పోర్చుగీసు యుద్ధ నౌకకు (2489 టన్నులు) కరాచీ రేవులో ఆగి, బొగ్గు వేసుకుని, ఆహారాది పదార్థాలు సమకూర్చుకో డానికి పాకిస్తాన్ ప్రభుత్వం అనుమతి ఇచ్చినదని నేడిక్కడ అధికార రీత్యా తెలియవచ్చింది.

ఈ నౌకపేరు అల్ఫోన్సో డి అల్బుకర్క్. 250 మంది సిబ్బంది గల యీ నౌక బుధవారంనాటికి కరాచీ చేరుతుంది.

మామూలుగా ఈ నౌక బొంబయి రేవులో బొగ్గువేసుకుంటూ ఉండేది కాని, ఈసారి బొంబాయి రేవులోని ప్రవేశం నిరాకరించబడే సందువల్ల కరాచీ రేవులోకి రావడానికి అనుమతించవలసిందని పోర్చుగల్ పాక్ ప్రభుత్వాన్ని అర్థించినందువల్ల ఈ ఏర్పాటు జరిగిందని తెలుస్తూంది.

### గోవా ప్రాంతంలో పోర్చుగీసు నౌక

కార్వార్, జులై 31: గోవా కు దక్షిణంగా 10 మైళ్ళ దూరంలోఉన్న అంజెద్వీపంలో సైనికదుస్తులు ధరిం-

-చిన పోర్చుగీసులు దిగారని విశ్వసనీయ వర్గాలద్వారా తెలియవచ్చింది.

ఈ ద్వీపంవద్ద, తుపాకులు అమర్చబడిన ఒక నౌక కనపడిందనీ, సైనికదుస్తులు వేసుకున్నవారు చకచక దిగడం అదీ కనపడిందనీ కార్వార్‌లోని అధికారవర్గాలవారు అన్నారు.

కార్వారుకు 8 మైళ్ళ దూరంలోని బింజ్ రేవు వద్దవున్న కోస్తాలీయ సుంకాలశాఖ ఉద్యోగులు మారదర్శినిద్వారా ఈ ఓడను చూచారట.

తరువాత ఆ ఓడ వెళ్ళిపోయినదట.

# "గృహనిర్మాణం మొదలయిన రంగాలలో కూడా సహకారోద్యమం ఇతోధికంగా పనిచెయ్యాలి"

## గవర్నరు త్రివేదీ ఉద్బోధ

కర్నూలు, జులై 31: అప్పులు ఇచ్చే విషయంలో నేకాక ఇతర రంగాలలో అనగా గృహనిర్మాణం, ఆహారధాన్యాలఉత్పత్తి, కుటీర పరిశ్రమలు మొదలయిన విషయాలలోనూ, సహకారసంఘాల సభ్యులలోనూ, తదితరులలోనూ, పొదుపరితనం పెంపొందించే విషయంలోనూ ఇతోధికంగా కృషి చేసే విషయంలో శక్తిసామర్థ్యాలను వినియోగించవలసిందిగా ఆంధ్ర సహకారోద్యమ కార్యకర్తలకు నేటి సాయంకాలం గవర్నరు శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేదీగారు సలహా చెప్పారు.

సహకార సంఘాలలో యే సహకారసంఘమూ విడిగ్గా సభ్యుని ఆస్తి కాదనీ ఇతరులను నష్టపెట్టి సహకార సంఘాలద్వారా స్వలాభాలను సాధించడానికి ఎవరూ ప్రయత్నించరాదనీ సహకారోద్యమ వతాకోత్సవోత్సవం జరుపుతూ సహకారశాఖమంత్రి డి. సంజీవయ్యగారు అన్నారు.

కర్నూలుజిల్లా కేంద్ర సహకార బ్యాంకు ఆవరణలో భారత సహకారోద్యమ రజతోత్సవసభలు ఆంధ్రరాష్ట్ర సహకారసంఘం ఆధ్వర్యాన జరిగినవి. పార్లమెంటుసభ్యుడు బెజవాడ రామచంద్రారెడ్డిగారు సభకు అధ్యక్షతవహించారు. (ఈ సభా విశేషాలను అందినంతవరకు 'ఆంధ్రపత్రిక' ఇదివరకే ప్రకటించింది. మిగతా వివరాలు నేడు ప్రకటిస్తున్నాము.)

మంత్రులు శ్రీ తెన్నేటి విశ్వనాథం, పి. తిమ్మారెడ్డిగారలూ, పబ్లిక్ వర్క్సుశాఖ కార్యదర్శి శ్రీ అనంతరామన్, అభివృద్ధిశాఖ కార్యదర్శి శ్రీ ఆర్. ప్రసాద్ గారలూ, శ్రీ నరసింహదేవర సత్యనారాయణ, పైడా వెంకటనారాయణ, పప్పూరి రామాచార్యులు, మాదాని సోమప్ప ప్రభృతులు ఈ సభలకు హాజరయారు.

రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్, ఉప రాష్ట్రపతి డాక్టరు రాధాకృష్ణ, మధ్యప్రదేశ్ గవర్నరు డాక్టరు పట్టాభిసీతారామయ్య, మద్రాసు గవర్నరు శ్రీ శ్రీప్రకాశ, శ్రీ వి. టి. కృష్ణమాచారి, పి. ఎస్. కుమారస్వామి రాజా, వి. వి. గిరి, క. వి. రెడ్డి, మురార్జీ దేశాయ్. హనుమంతయ్య రిజర్వుబ్యాంకు గవర్నరు శ్రీ బి. రామారావ్ ప్రభృతులు పంపిన శుభాభినందనలను గురువారెడ్డిగారు సభలో చదివారు.

సహకారోద్యమ వతాకోత్సవం జరుపుతూ సహకారశాఖమంత్రి డి. సంజీవయ్యగారు ఇలా అన్నారు:

"సహకారోద్యమం సాధించిన విజయాలనూ, ఉద్యమంలోని లోపాలనూ, రైతులకు ఈ ఉద్యమంవల్ల కలిగిన సహాయాన్నీ సమీక్షించుకొనడానికి యీ అవకాశాన్ని సహకారోద్యమ కార్యకరలు వినియోగించుకోవాలి. రైతుల అవసరాలనే ప్రతి ప్రజాహిత సంస్థ ప్రధానంగా పరిగణించాలి. రైతుల శ్రేయస్సాధనకు చేయగలిగినదంతా చేశామా అనే విషయం గురించి సహకారవాదులు ఆలోచించాలి. రైతులకు రుణాలు ఇచ్చే విషయంలో ఆలస్యం జరిగిన సంఘటనలు అసంఖ్యాకంగా ఉన్నవి. సహకారోద్యమం మంతా తమ సత్తె హక్కు, ఇతరులకు ఇందులో యేమీలేదు అనే దృష్టితో సహకారోద్యమంలో కొందరు వ్యవహరిస్తున్నారు. ఇట్టివాటికి సహకార రంగంలో తావు ఉండరాదు. ఈ లోపాన్ని సహకారవాదులు నిర్మూలించాలి

### గవర్నరు ప్రసంగం

అటుతరువాత గవర్నరు శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేదీగారు ఉత్సవాలను ప్రారంభిస్తూ ఇలా అన్నారు:

"శ్రీ మోచర్ల రామచంద్రరావ్, రామదాసుపంతులు గారలవంటి అతిరథ మహారథుల రోజులు గడిచిపోయినవి. సుమారు పాతికముప్పయి సంవత్సరాలక్రిందట మధ్యప్రదేశ్‌లో సహకారోద్యమంతో నాకు కూడా కొంత పరిచయం ఉన్నది. సహకారోద్యమంగురించి నాకున్న జ్ఞానం రిప్‌వాన్ వింకిల్ జ్ఞానం వంటిది కావచ్చు. అయినా ఆంధ్రలో సహకారోద్యమం చాలా ఎక్కువగా పనిచేస్తున్నదని నాకు స్పష్టమయింది. కాని, సహకార సంఘాలన్నీ చేయవలసినంత పనిచేస్తే నిజంగా ఇంకా చాలాపని జరిగి ఉండవలసింది. ఇప్పుడున్న సహకారసంఘాలకు తగినంత ఆర్థిక సౌకర్యంలేనిమాటా, వకీలంలో వచ్చు వాటికి అండే సౌకర్యంలేని మాటా నిజమే. అప్పగాలెచ్చిన పెట్టుబడిలో నూటికి రెండువంతులు మాత్రమే సొంత పెట్టుబడి ఉండడం ఆశ్చర్యంగా ఉన్నది. ఇది నూటికి పదివంతులకంటే ఎక్కువగా ఉండవలసింది. సహకారసంస్థలు అనేవి పొదుపరితనాన్ని పెంపొందించి ఎంత చిన్న మొత్తాలనయినాసరే సభ్యులు కాని వారివద్దనుంచికూడా డిపాజిట్లు సేకరించే సంస్థలుకూడా. అటువంటిది జరక్కపోతే ఈ సంఘాలపట్ల ప్రజలకు నమ్మకంలేదని అర్థమన్నమాట. దేశమంతటా జాతీయవికాస కార్యక్రమాలూ, సమాజవికాస కార్యక్రమాలూ అమలు జరుగనున్నవి కనుక సహకారోద్యమం ఇతర రంగాలలోకి కూడా వ్యాపించడానికి ఇది మంచి తరుణం. సహకారోద్యమం ప్రాయికంగా ప్రజల ఉద్యమం. కనుక ఈ అవకాశాన్ని సహకారోద్యమం సద్వినియోగం చేసుకొని అన్ని స్థాయిలలోనూ నాయకులను తయారుచేసి గ్రామీణ సముద్ధరణకు సహకారోద్యమంకంటే ఎక్కువగా వినియోగపడగల వద్ధతే దేదని రుజువు చెయ్యాలి."

### వస్తుప్రదర్శనం

అటుతరువాత పరిశ్రమలశాఖమంత్రి ఎస్. బి. పి. పట్టాభిరామారావుగారు సహకార ప్రదర్శనకు ప్రారంభోత్సవం జరిపారు. ఆంధ్రరాష్ట్ర చేనేత సహకార సంఘంవారు పంపించిన చేమగ్గాలూ, ఎమ్మిగనూరునుంచి వచ్చిన మేలిరకం చేనేతవస్త్రాలూ, ఆంధ్రలో సహకారోద్యమం తాలూకు కార్యకలాపాలనువివరించేపోస్టర్లూచిత్రాలూ ప్రదర్శించబడినవి.

మంత్రి పట్టాభి రామారావు గారు ప్రదర్శనకు ప్రారంభోత్సవం జరుపుతూ చేనేత సహకార సంఘాల తయారయిన వస్త్రాలను కొనవలసిందిగా ప్రజలను విజ్ఞప్తిచేశారు. గుంటకల్లు నూలు మిల్లు పద్ధతిలో త్వరలో వస్త్రాలు, పంచదార పరిశ్రమలుకూడా నిర్వహించబడుతవని ఆశిస్తున్నానన్నారు. సహకారోద్యమంవల్ల మన ఆర్థిక వ్యవస్థ బాగుపడుతుంది. కనుక మనమందరం ఈ ఉద్యమంలో పాల్గొని దాన్ని ప్రోత్సహించాలనికూడా పరిశ్రమల మంత్రి ఉద్బోధించారు.

### ట్యూనీషియాకు కొత్త రెసిడెంట్ జనరల్

పారిస్, జులై 30: ప్రస్తుతం ట్యునీషియాలో ఫ్రెంచి రెసిడెంట్ జనరల్‌గా వుంటున్న పీరెవిజర్లుస్థానే మెండెస్ ఫ్రాన్సు ప్రభుత్వం లెఫ్టినెంట్ జనరల్ బాయర్ డిలాతూర్ దుమేలిన్‌ను రెసిడెంట్ జనరల్‌గా నియమించింది. గతవారంలోనే ఈయన మేజర్ జనరల్ హోదానుంచి లెఫ్టినెంట్ జనరల్ హోదాకు పెంచబడినాడు.

ఉత్తర ఆఫ్రికాలోని ఫ్రెంచిరక్షిత రాజ్యాల విషయమయిన ప్రధాని మెండిస్ ఫ్రాన్సు తాను ఆలోచించిన సంస్కరణలను ప్రకటించిన అనంతరం కొద్ది గంటలకే ట్యూనిస్‌లో యీ రెసిడెంట్ జనరల్ మార్పుగూడా ప్రకటించబడింది.

పారీ ఇప్పుడు మెండెస్ ఫ్రాన్సు ప్రకటించిన సంస్కరణలు అమలు జరగాలంటే ట్యునీషియా బీటిని ఆమోదించాలి. ఆ ఆమోదాన్ని పొందడానికి ప్రధాని ఫ్రాన్సే స్వయంగా ట్యూనీషియాకు ఒకసారి వెళ్లి వస్తాడని అనుకుంటున్నారు. ఒక రక్షణ, ఆర్థిక వ్యవహారాలలో తప్ప తక్కిన అన్ని విషయాలలోను యీ ట్యునీషియాకు స్వయంపాలనం ఇవ్వాలని యీయన ఆలోచిస్తున్నాడు.

### మంత్రి తిమ్మారెడ్డిగారి కార్యక్రమం

కర్నూలు, ఆగస్టు 1: ఆంధ్రరాష్ట్ర పురపాలక సంఘాధ్యక్షుల సంఘం తాలూకు కార్యవర్గం ఈ నెల 4 వ తేదీన ఇక్కడ సమావేశమవుతుంది. స్థానిక పరిపాలనా శాఖమంత్రి పి. తిమ్మారెడ్డిగారు ఆ కార్యవర్గ సమాలోచనలలో పాల్గొంటారు.

తిరుపతిలో ఈ నెల 8 వ తేదీ జరుగనున్న ఆంధ్రరాష్ట్ర పంచాయతీ ప్రతినిధుల సర్వసభ్య సమావేశంలో స్థానిక పరిపాలనామంత్రి పాల్గొంటారు. ఈ నెల 18 వ తేదీన ఢిల్లీలో జరుగనున్న ప్లానింగ్ కమిషన్ ప్రజారోగ్యానికి చెందిన విభాగం సమావేశంలో మంత్రి తిమ్మారెడ్డిగారు పాల్గొంటారు. పురపాలకసంఘాల సిఫార్సులు ప్రణాళికలను గురించి ఆ సమావేశంలో ప్రధానంగా చర్చిస్తారు.

కాశ్మీరులో ఇటీవల అయిగు రాష్ట్రాల మంత్రులలో విర్వసిన సంఘం ఈ సందర్భంలో ఈ నెల 18 వ తేదీన ఢిల్లీలో స్థానింగు కమిషన్ను కలుసుకొంటుంది.

# ఇండోచైనాకు ఉద్యోగుల పయనం

(1 వ పేజీ తరువాయి)

ఒక ప్రతినిధి అన్నారు. సమావేశం 2½ గంటసేపు జరిగింది. రేపు మళ్ళీ జరుగుతుందని తెలిసింది.

యుద్ధ విరమణ కమీషన్లను సాధ్యమైనంతత్వరలో ఏర్పాటుచేయటం అవసరమని ప్రతినిధులంతాకూడా భావిస్తున్నారనీ అందుకు సమస్త ప్రయత్నాలూ జరుగుతాయనీకూడా ప్రతినిధి అన్నారు.

ముందుగాపక్షే బృందం ఈ ఏర్పాటుచేసే కమీషన్లకు అక్కడగల సదుపాయాలేమిటో, చేయవలసిన సదుపాయాలేమిటో త్వరితంగా ఈ మూడు ప్రభుత్వాలకు తెలియచేస్తుంది.

ముందుగా పక్షే బృందం ఇండోచైనాలోని నాలుగుప్రభుత్వాల ప్రధాన కార్యాలయాలకూ వెళ్తారు. లావోస్, కాంబోడియా, వియెట్నాం, వియెట్నాం రిపబ్లిక్ (వియెట్మిన్) ప్రభుత్వాల ప్రధాన కార్యాలయాలు వరుసగా వియంటెనె, ప్నాంపెన్, సైగాన్, హానోయ్ నగరాలలో ఉన్నాయి.

మూడు పర్యవేక్షణ సంఘాల సభ్యులూ, వారి సిబ్బంది, ప్రయాణం చేయడానికి ఏర్పాట్లూ, వాటికయే ఖర్చులూ; ఒక్కొక్క దేశమూ పంపవలసిన సైనిక సిబ్బందీ, సి. వి. వి. యస్ సిబ్బందీ ఎంతెంతమంది ఉండాలీ మొదలైన విషయాలనుగురించి కూడా నేడు చర్చించారు.

మూడు పర్యవేక్షణ సంఘాలలోనూ నియమించబడే భారత ప్రతినిధులపేర్లు వారం రోజులలో ప్రకటించబడగలవని ఇక్కడి ఉద్యోగి ఒకరు అన్నారు.

నేటి సమావేశానికి భారత సర్వసేనాని జనరల్ రాజేంద్ర సింహజీ, దక్షిణ ప్రాంతీయ సేనాధిపతి లెఫ్టినెంట్ జనరల్ శ్రీనగేష్, మేజర్ జనరల్ చౌదరి ప్రభృతులుకూడా హాజరయ్యారు.

# హైద్రాబాద్ - సికింద్రాబాద్‌లను కలిపే సూచన

## జిల్లాకాంగ్రెస్ విముఖత

సికింద్రాబాదు, ఆగస్టు 1: సికింద్రాబాదు, హైదరాబాదు కార్పొరేషనులు కలిపివేయాలన్న సూచనను వ్యతిరేకిస్తూ నేడు సికింద్రాబాదుజిల్లా కాంగ్రెసు సంఘం తీర్మానించింది. తీవ్రచర్చల అనంతరం వోటింగు జరగగా రెండు కార్పొరేషన్లు ఏకంచేయాలన్న తీర్మానం 8 వోట్లు మెజారిటీతో వోడించబడింది. 19 మందికి 14 మంది సభ్యులు హాజరైనారు. ఇందులో 10 మంది వ్యతిరేకంగానూ, ఇద్దరు అనుకూలంగానూ వోటుచేశారు. ఇద్దరు వోటుచేయలేదు.

ఉపాధ్యక్షులు శ్రీ రాములాల్ యీ కార్యక్రమం నిర్వహించారు. శ్రీ గురుమూర్తి, యస్. ఆర్. వెంకటేశం గార్లు తీర్మానానికి అనుకూలంగా మాట్లాడుతూ రెండునగరాలను కలిపి ఏకకార్పొరేషనుక్రింద వుంచితే తెలుగువారి హక్కులు సాధించబడగలవని వాదించారు. (స్వ. వి.)

# మరతో తయారుచేసే బీడీలపై సుంకం

న్యూఢిల్లీ, జులై 29: విద్యుచ్ఛక్తితోగానీ, ఇతరత్రాగానీ యంత్రాలతో తయారు చేసే బీడీలపై వెయ్యికి రూ. 3/లు సుంకం విధిస్తూ భారత ప్రభుత్వం నేడు ఒక ఆర్డినెన్సు జారీ చేసింది.

బీడీలను చేతితో తయారు చేయించటం చాలా మందికి వృత్తినిస్తుందికనుక, యంత్రాలతో తయారు చేయించటాన్ని నిరుత్సాహ పరిచేందుకు ఈ సుంకం విధించారు. దీనివల్ల ఆదాయం వస్తుందని కాదనీ, బీడీ పరిశ్రమలో వున్న సుమారు 6000 మంది కార్మికుల జీవనాధారం, యంత్రాలవల్ల, పోకుండా చేయుటమే ముఖ్యోద్దేశమనీ తెలుస్తున్నది.

న్యూఢిల్లీ, జులై 31: ఆగస్టు, ఒకటవ తేదీన మాస్కోలో ప్రారంభం కానున్న అఖిల సోవియటు వ్యవసాయ ప్రదర్శనలో పాల్గొనడానికి భారత దేశం తరఫున కేంద్ర ఆహారశాఖ ఉపమంత్రి ఎం. వి. కృష్ణప్పగారి నాయకత్వాన ఒక రాయబారవర్గం ఆగస్టు. 1 వ తేదీన బయలుదేరి వెళుతుంది.

ఈ వర్గంలో ఉత్తర ప్రదేశ్ ఆహారశాఖ ఉపమంత్రి జె. పి. రావత్, పూనా వ్యవసాయ కేంద్రానికి చెందిన శ్రీమతి ఎం. సిక్కా, కలకత్తా బొటానికల్ గార్డెన్ డైరక్టరు క. విశ్వాస్ గార్లు వున్నారు. వీరు సోవియటు యూనియనులో 10 రోజులపాటు ఉంటారు.

